శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



# పంచసంస్కార మహిమ

**(వైకుంఠవాసి, మహా విద్వాన్, తిరుమలై తిరువళ్లూర్ ఈచ్చంబాడి**
**శ్రీ ఉ. వే. రంగనాథాచార్య మహాదేశికన్ స్వామి**
**అనుగ్రహించిన ఉపన్యాసం ఆధారంగా)**




మలయప్ప స్వామి, తిరుమల



*'పండితరత్న' డా|| ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి అళ్గియ శింగరాచార్యులు*

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

# నివేదన

శ్రీ వైష్ణవుడు అయినవాడు ప్రతి ఒక్కడు అందవలసిన సంస్కారాలు ఐదు. వాటికి పంచ సంస్కారాలు అని పేరు. వీటిని పొందవలసిన ఆవశ్యకత, వీని స్వరూపం, వీటిని పొందినందువల్ల కలిగే ప్రయోజనం, ఏ విధంగా వీటిని పొందాలి? అనే విషయం– అని ఈ విధంగా ఉండే పలు విషయాలు మహానుభావులైన తిరువళ్లూర్ ఈచ్చంబాడి ఉ. వే. శ్రీమాన్ శ్రీరంగనాథ మహాదేశికన్ స్వామివారు మధురమైన శైలిలో సరళంగా ద్రావిడ భాషలో ఉపన్యాసాన్ని అనుగ్రహించారు. దాని సారమే ఈ వ్యాసం. ఈ ఉపన్యాసాన్ని నాకు అందజేసి సహాయపడిన వేద పండితులు, మిత్రులు, శ్రీమాన్ బుక్కపట్నం నరసింహ శర్మ గారికి అనేక కృతజ్ఞతలను సమర్పించుకుంటున్నాను. దీనిని పుస్తక రూపంలో సిద్ధం చేయడం లేదు నాకు సహకరించిన వర్ధిష్ణవు శ్రీమాన్ కేశవ అయ్యంగారికి అనేక మంగళాశాసనాలు. ఇది ఆస్తికపాఠకులను ఆనందింప చేస్తుందని భావిస్తాను. స్వస్తి.

భాగవతదాసుడు,

ఈ ఏ శింగరాచార్యులు.



# పంచసంస్కార మహిమ

**జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్,**
**ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే.**

పంచసంస్కారానికి సంబంధించిన కొన్ని ఆవశ్యకమైన విషయాలు ఈ వ్యాసంలో నివేదింపబడుతున్నాయి.

"ప్రయోజనమనుద్దిశ్య న మందోపి ప్రవర్తతే" అనే ఒక సామెత ఉన్నది. అంటే, తెలివి తక్కువ వాడు కూడా ఏ ప్రయోజనాన్ని కోరకుండా ఏ పనిలోనూ ఆసక్తిని కలిగినవాడు కాడు.

ఈ విధంగా ఆశపడే ప్రయోజనాలు రెండు విధాలుగా ఉంటాయి. కొన్ని ఈ లోకంలో పొందబడే ప్రయోజనాలు. అవి ఈ లోకంలో ఈ శరీరంతోనే అనుభవించే ప్రయోజనాలు. ఇవి ఐహిక ఫలాలు అని అనబడతాయి.

పరలోకంలో పొందబడే ప్రయోజనాలు ఆముష్మిక ప్రయోజనాలు. అవి రెండు విధాలుగా ఉంటాయి. కొంతకాలానికి నశించిపోయే స్వర్గ ప్రాప్తి మొదలైన ఫలాలు ఒక విధమైనవి. ఇంకొక విధమైన ఫలం ఏమంట, ఏనాటికీ నశించని నిత్యమైన మోక్షం.

ఈ విధంగా ఉండే, ఈ లోకంలో పొందబడే, పరలోకంలో పొందబడే రెండు విధాలైన ప్రయోజనాలను సాధించడం కోసం పురుషోత్తముడైన శ్రీమన్నారాయణుని ఆరాధించడం తప్ప, వేరు ఏ విధమైన ఉత్తమమైన సాధనం, అంటే, గతి లేదు. వేదాలు, స్మృతులు, ఇతిహాసాలు, పురాణాలు మొదలైనవి ఈ వాస్తవాన్ని పలుచోట్ల పలు విధాలుగా మనకు తెలియజేశాయి.

ఈ విషయంలో కొన్ని ఉదాహరణలను చూద్దాం. "ప్రవః పాంథ పంథసో ధియాయతే, మహేశూరాయ విష్ణవే చార్చత" అని ఋగ్వేదం మంత్రం ఒకటి ఉన్నది. "అర్చత ప్రార్చత ప్రియమేధాసో అర్చత" అనేది ఇంకొక మంత్రం ఉన్నది. "ఇంకా, ఇంకా అధికంగా ప్రయోజనాలను పొందాలంటే విష్ణువును ఆరాధించండి. విష్ణువును ఆరాధించడం మానవద్దు. " అనేది సంగ్రహంగా ఈ మంత్రాలలోని భావం

నారద మహర్షి ఈ విధంగా ఉపదేశిస్తున్నారు— "సర్వేషా మేవ లోకానాం గురుః నారాయణో హరిః, తస్య సంపూజనం కార్యం సర్వపాప హరం హి తత్" —"అన్ని లోకాలకు నారాయణుడే గురువు, గొప్పవాడు, అతనిని ఆరాధించాలి. ఆ స్వామిని ఆరాధించడం వల్ల అన్ని పాపాలు నశిస్తాయి" —అని దీని భావం.

వ్యాసమహర్షి కూడా ఈ విధంగా అంటున్నాడు. "న విష్ణ్వారాధనాదన్యం పుణ్యం విద్యతే కర్మ వైదికమ్, తస్మాదనాదిమధ్యాంతం నిత్య మారాధయేద్ధరిమ్"

"విష్ణువు యొక్క ఆరాధన కంటే వేరొక వైదికమైన పుణ్యకర్మ లేనే లేదు. అందువల్ల ఆది, మధ్యం, అంతం లేనటువంటి హరివి నిత్యం ఆరాధించాలి" అని దీని భావం.

శ్రీమద్భాగవతం ఈ విధంగా తెలుపుతున్నది. "గృహం స్మశానం తవ బింబవర్జితమ్" — "భగవంతుడైన శ్రీమన్నారాయణని అర్చామూర్తి లేని గృహం స్మశానందతో సమానమైనది. అందువల్ల ప్రతి ఒక్కరూ విష్ణువు యొక్క ఆరాధనను చేయాలి" అని దీని తాత్పర్యం.

**దానికి తగిన యోగ్యత ఏది? అనేదానిని ఇపుడు వివరిస్తాను.**

విష్ణువును ఆరాధించేవారు వైష్ణవులు. విష్ణువును పరదేవతగా భావించి దర్శించేవారు వైష్ణవులు. దక్షిణ దేశంలో మధ్వ సంప్రదాయానికి చెందినవారు,

ఉత్తరదేశంలో నింబార్క, చైతన్య, వల్లభ, రామానంద సంప్రదాయాలకు చెందినవారు కూడా విష్ణువును ఆరాధించేవారే. వైష్ణవులే అయినప్పటికీ, భగవద్రామానుజుల శ్రీచరణ సంబంధాన్ని కలిగినవారు శ్రీ వైష్ణవులు అని చెప్పబడుతున్నారు. ఆచార్యపరంపరలో " ఇన్న ముద త్తిరుమగళ్ ఎన్నివరై మున్నిట్టు ఎంబెరుమాన్ తిరువడికళ్ అడైకిన్టేనే" అనే శ్రీదేశికుల శ్రీ సూక్తి ప్రకారం లక్ష్మీదేవిని భగవంతుని తరువాత సేవించి, ఆచార్య స్థానంలో ఆరాధిస్తున్నందున, నాథమునులు మొదలైన పూర్వాచార్యపరంపరకు చేరినవారు శ్రీవైష్ణవులు అని, వీరి సంప్రదాయం శ్రీవైష్ణవ సంప్రదాయమని, శ్రీ సంప్రదాయమని లోకంలో ప్రసిద్ధి చెందినది.

పైన ప్రస్తావించిన వైష్ణవ సంప్రదాయానికి చెందినవారు అందరూ వైష్ణవదీక్షను స్వీకరిస్తున్నారు శ్రీవైష్ణవ సంప్రదాయంలో ఈ దీక్ష మంచి సంస్కార రూపంగా స్వీకరింపబడుతున్నది. కలి ప్రభావం చేత, అజ్ఞానం వల్ల కొంతమంది ఈ సంస్కారాన్ని పొందడం లేదు. కొంతమందికి అయితే, " ఈ పంచ సంస్కారం ఆవశ్యకమా? "అనే సందేహం కూడా ఉన్నది. ఇటువంటి వారికి కలిగే సందేహాలను తీర్చడం కోసమే ఈ వ్యాసప్రయత్నం.

## సంస్కారం అంటే ఏమి?

"సమ్యక్ కరోతి ఇతి సంస్కారః " అనేది సంస్కార పద వ్యుత్పత్తి. చక్కనిది, గొప్పది అయ్యేటట్లు చేయడానికి సంస్కారం అని పేరు. దున్నడం వల్ల భూమి చక్కగా ఫలిస్తున్నది. వండడం ద్వారా భుజించే పదార్థాలను మనం ఉపయోగించగలుగుతున్నాము పాత్రలను కడగడం వల్ల అవి ఉపయోగించడానికి తగిన యోగ్యతను పొందుతున్నాయి. ఉతకడం వల్ల బట్టలు శుభ్రపడుతున్నాయి. సానబట్టడం వల్ల రత్నాలు అంతకు ముందు కంటే ఎక్కువ కాంతిని పొందుతున్నాయి. ఒక వ్యక్తికి అతడు ముందు ఉన్న స్థితి కంటే ఉన్నతమైన స్థితిని పొందించడం సంస్కారమని అనబడుతుంది.

**సంస్కారాలు ఎన్ని? అనేది ఇంకొక ప్రశ్న.**

ధర్మశాస్త్రాలు ఒక వ్యక్తికి చేయబడే సంస్కారాలు 40 అని తెలుపుతున్నాయి అవి ఏవి? అంటే, గర్భాధానం, పుంసవనం, సీమంతోన్నయనం, జాతకర్మ, నామకరణం అన్నప్రాశనం, చౌళం, ఉపనయనం, నాలుగు వేదాల అధ్యయనం, స్నానం, వివాహం, పంచ మహా యజ్ఞాల అనుష్ఠానం, అంటే, అగ్నిష్టోమం మొదలైన ఏడు విధాలైన సోమయాగాలు ఏడు విధాలైన పాకయజ్ఞాలు, ఏడు విధాలైన హవిర్యజ్ఞాలు అనేవి అవి.

వీటిలో, గర్భాధానం నుండి ఉపనయనం వరకు గల ఎనిమిది సంస్కారాలు తండ్రి చేయవలసినవి. నాలుగు వేదాల అధ్యయనం, స్నానం అనబడే సమావర్తనం, వివాహం అనే ఆరు తనకు తానే చేసికోవలసిన సంస్కారాలు. వివాహం అయిన తరువాత తన ధర్మపత్నితో కలసి పంచ మహా యజ్ఞాలు, సోమయజ్ఞాలు ఏడు, పాక యజ్ఞాలు ఏడు, హవిర్యజ్ఞాలు ఏడు– అనే ఇరవై ఆరు సంస్కారాలను చేయాలి. ఈ విషయంలో కొంతమంది సూత్రకారులు వేరు విధంగా కూడా తెలియజేశారు. వివాహానికి తరువాత చెప్పబడిన సంస్కారాలను చాలామంది చేత ఆ యా సమయాలలో అనుష్ఠించడానికి సాధ్యం కావడం లేదు. వేదంలోనూ, స్మృతులలోనూ ఇవి విధింపబడినందున ఇవి శ్రౌత స్మార్త సంస్కారాలు అనబడతాయి.

**శ్రీవైష్ణవ దీక్ష అంటే ఏమి?**

విష్ణువును ఆరాధించడానికి వైష్ణవ దీక్ష ఆవశ్యకం. విష్ణువు ఆరాధన స్వార్థయజనమని, పరార్థయజనమని రెండు విధాలు. తన క్షేమం కోసం, తన కుటుంబ సభ్యుల క్షేమం కోసం తన ఇంటిలో చేయబడే విష్ణు యొక్క ఆరాధన స్వార్థయజనం అనబడుతుంది. అందరికీ సాధారణమైన ఆలయాలు మొదలైన చోట్ల దేశక్షేమం కోసం, దేశంలోని ప్రజల సౌభాగ్యం కోసం, ప్రభువుల క్షేమం కోసం భగవంతుని ఆరాధించడానికి పరార్థయజనం అని పేరు. పరార్థయజనాన్ని చేసేవారు దానికి తగిన యోగ్యతను

పొందాలి వైష్ణవాలయాలలో భగవంతుని ఆరాధన శ్రీ పాంచరాత్రం, శ్రీ వైఖానసం అనే రెండు విధాలైన ఆగమాలలోని నియమాల ప్రకారం చేయబడుతుంది. శ్రీ పాంచరాత్రాగమప్రకారం వైష్ణవాలయాలలో భగవంతుని ఆరాధన చేసేవారు ఆ ఆగమాలలో విధింపబడిన దీక్షను పొందాలి. స్వార్ధ యజనం చేసే వారికి కూడా విధింపబడిన ఒక దీక్ష ఉన్నది. ఆ దీక్షను, లేక, సంస్కారాన్ని పొందనివారు భగవంతుని ఆరాధనను చేయడానికి యోగ్యతను కలిగిన వారు కాబోరు.

తమ తమ గృహాలలో భగవంతుని ఆరాధించడం కోసమే పొందవలసిన దీక్ష, లేక, సంస్కారం సమాశ్రయణం అని అనబడుతుంది. దీని అర్థం ఏమంటే, ఒక సదాచార్యుని చక్కగా క్రమానుసారంగా ఆశ్రయించడం. తనను ఆశ్రయించిన శిష్యుడు భగవంతుని ఆజ్ఞ అనుజ్ఞా రూప కైంకర్యాలను చేయడంలో తగిన యోగ్యత పొందడం కోసం కొన్ని సంస్కారాలను ఆచార్యుడు చేస్తాడు. అవి సంఖ్యలో ఐదు. అందువల్ల అవి పంచ సంస్కారాలు అనబడుతున్నాయి.

**పంచ సంస్కారాలు ఏవి?**

భగవానునికే చెందినవాడుగా అయ్యేటట్లు చేయడం కోసం ఐదు సంస్కారాలు చేయబడతాయి. అవి, "తాపః పుండ్రః తథా నామ మంత్రో యాగశ్చ పంచమః" అనే వచనానుసారం తాపం, పుండ్రం, నామం, మంత్రోపదేశం, యాగం అనేవి.

వీటిలో,

1) తాపం అంటే– హోమం చేయబడిన అగ్నిలో లోహంతో చేయబడిన శంఖచక్రాలను బాగా తాపం పొందేటట్లు చేసి, వాటిని రెండు భుజాలపై ముద్రించడం.

2) పుండ్రం అంటే– తిరుమణ్ కాప్పు. శ్వేతమృత్తికను, శ్రీచూర్ణాన్ని ఫాలభాగంలోనూ, ఇంకా శరీరంలో నిర్దేశింపబడిన కొన్ని భాగాలలోను ధరించడం పుండ్ర సంస్కారం అనబడుతుంది.

3) నామ సంస్కారం అంటే – సమాశ్రయణాన్ని చేసికొన్నవారు తాము భగవంతునకు దాసులు అవుతున్నందున, భగవంతుని నామాన్ని పురస్కరించుకొని, అతనికి తాను దాసుడు –అనే అర్థం వచ్చే నామాన్ని పెట్టుకోవడం నామ సంస్కారం అనబడుతుంది. భగవాన్నామంతోనే కాకుండా, భగవద్రామానుజ నామాన్ని పురస్కరించుకొని ఆ ఆచార్యులకు దాసుడనే అర్థం వచ్చేటట్లుగా "అడియేన్ రామానుజ దాసన్" అనే శేషత్వ నిరూపకమైన నామాన్ని ధరించడంకూడా నామ సంస్కారం అని వ్యవహరిస్తారు.

4)నాలుగవ సంస్కారం మంత్రోపదేశసంస్కారం. శ్రీవైష్ణవులై ఉండేవారు తప్పక ఉపదేశం పొందవలసిన మంత్రాలు కొన్ని ఉన్నాయి. వాటిలో రహస్య త్రయం అనబడే అష్టాక్షరి, ద్వయ మంత్రం శ్రీకృష్ణ చరమ శ్లోకం అనే మూడు చాలా ముఖ్యమైనవి. ఈ మంత్రాలను ఆచార్య ముఖతః ఉపదేశంగా పొందడం మంత్ర సంస్కారం అనబడుతుంది.

5) ఇక, చివరిది, అయిదవది యాగ సంస్కారం. భగవంతునకు చేసే తిరువారాధన యాగ సంస్కారం అనబడుతుంది. భగవంతుని ఆరాధనను చేసే క్రమాన్ని ఆచార్య సన్నిధిలో ఉపదేశంగా పొందడానికి యాగ సంస్కారం అని అంటారు.

పంచ సంస్కారాలు అనబడే ఈ ఐదు చాలా విలక్షణమైన సంస్కారాలు వీటిని ఆచార్య సన్నిధిలో పొందినవాడే పరమైకాంతి అని అనబడతాడు. అంటే, "మఱందుమ్ పుఱమ్ తొ*ழு*దవన్" ( మరచిపోయి కూడా అన్యదేవతలను ఆరాధించనివాడు),

**ఇప్పుడు ఈ ఐదు సంస్కారాలను గురించి ఇంకా కొంచెం వివరంగా తెలిసికొందాం.**

**తాప సంస్కారం**

హోమాగ్నిలో తప్తం చేసిన శంఖ చక్రాలు అనబడే సుదర్శన పాంచజన్యాల చిహ్నాలను కుడి, ఎడమ భుజాలలో పొందడమే తాప సంస్కారం.

ఎవరి శరీరాన్నికూడా అగ్నితో దహించకూడదని, గాయం చేయకూడదని శాస్త్రం తెలుపుతున్నది కదా. అందువల్ల శరీరానికి బాధను, గాయాన్ని కలిగించే తాప సంస్కారం అనేది చేయదగినది కాదు కదా –అని కొందరు వాదిస్తారు. సచ్చరిత్ర రక్ష అనే గ్రంథంలో శ్రీవేదాంతదేశికులు ఇటువంటి వాదాలకు తగిన సమాధానాలను ఇవ్వడంతో పాటు, వేదేతిహాస పురాణాదులనుండి పలు ప్రమాణాలను చూపించి, తప్తశంఖచక్రాంకనం తప్పక చేసికోవలసిన సంస్కారం అని నిరూపించారు. ఆ విషయాలులో కొన్ని సంగ్రహంగా ఇక్కడ నివేదింపబడుతున్నాయి.

ఆథర్వ మహోపనిషత్తులోని బ్రహ్మ సూత్రంలో ఈ విధంగా చెప్పబడుతున్నది,

"దక్షిణే తు భజే విప్రో బిభృయాద్వై సుదర్శనమ్,
సవ్యే తు శంఖం బిభృయాత్ ఇతి బ్రహ్మ విదో విదుః"

బ్రాహ్మణులు భగవంతుని చిహ్నాలు అయిన సుదర్శన పాంచ జన్యాలను క్రమంగా కుడి భుజంలోనూ, ఎడమ భుజంలోను ధరించాలి– అని ఈ ప్రమాణంలోని అర్థం.

యజుర్వేదానికి చెందిన కఠశాఖలోని ఒక మంత్రంలో–

"ధృతోర్ధ్వపుండ్రః కృతచక్రధారీ
విష్ణుం పరం ధ్యాయతి యో మహాత్మా,
స్వరేణ మంత్రేణ సదా హృది స్థితం
పరాత్పరం యన్మహతో మహాంతమ్"

ఊర్ధ్వపుండ్రాలను ధరించినవాడు, శంఖ చక్రాలను ధరించినవాడైన మహాత్ముడు స్వరహారి అనే ప్రణవం అనబడే మంత్రంతో, హృదయంలో నివసించేవాడు, సంసారుల కంటే, నిత్య సూరుల కంటే గొప్పవాడు, అన్నిటి కంటే పెద్దవాడు అయిన విష్ణువును ధ్యానించాలి.

ఋగ్వేదానికి చెందిన భాస్కర శాఖలో చెప్పబడే ఒక మంత్రం—

ప్రతే విష్ణో! ఆబ్జచక్రే పవిత్రే
యన్మాంబోధిం తత్త్వవే చర్షణీంద్రాః,
మూలే బాహ్వోః దధతే యే పురాణాః
లింగాన్యంగే తావకాన్యర్పయంతి"

ఓ విష్ణు దేవా! సంసారం అనే సముద్రాన్ని దాటడం కోసం బుద్ధిమంతులు నీ చక్రాన్ని, శంఖాన్ని భుజాలలో ధరిస్తున్నారు. శ్రీవైష్ణవేతరులు నీ పంచాయుధాలను ఐదు చోట్ల ధరిస్తున్నారు.

యజుర్వేదానికి చెందిన బృహదారణ్యకంలోనూ, అధర్వణ వేదానికి చెందిన సుదర్శనోపనిషత్తులోను ఈ క్రింది విధంగా చెప్పబడింది.

నిచిక్షేప సుషణం భిద్యమానం
మధ్యే బాహు మదధత్ సుదర్శనమ్,
విష్ణో రిదం భూరిదం భూరితేజః
ప్రదర్శదితి వా నక్తం బిభృయ స్తజ్జనాసః"

భుజాలలో విష్ణువు యొక్క అసాధారణ చిహ్నం, పాపాలను పోగొట్టి, మంగళాలను కలిగించేది, మిక్కిలి తేజస్సును కలిగినది అయిన సుదర్శనాన్ని ఎవరు భుజాలలో

ధరిస్తారో, వారు మిగిలిన ఆయుధాలను విడచి, సుదర్శనాన్ని ధరిస్తున్నారు. (అంటే, ఎల్లప్పుడూ సుదర్శనాన్ని ధరించాలి— అని భావం. )

ఈ విధంగా కొన్ని ఉదాహరణలను చూపించాము. పది శ్రుతి వాక్యాలను ఉదాహరించి, వాటి అర్థాలను కూడా తెలియజేసి, తప్త శంఖ చక్రాంకనం తప్పక కర్తవ్యం అనే విషయాన్ని దేశికులు తెలియజేశారు. ఇక, కొన్ని స్మృతి వచనాలను పురస్కరించుకొని, తప్తశంఖచక్రాంకనం ఆవశ్యకం అనే విషయాన్ని వారు నిరూపిస్తున్నారు.

శాండిల్య స్మృతి ఈ విధంగా తెలియజేస్తున్నది.

పశుపుత్రాదికం సర్వం గృహోపకరణాని చ,
అంకయేత్ శంఖచక్రాభ్యాం నామ కుర్యాచ్చ వైష్ణవమ్"

పశువులు, పుత్రులు మొదలైనవానిని, ఇంటిలో ఉపయోగించే సమస్త సామగ్రిని భగవంతుని ఆయుధాలైన శంఖచక్రాలతో అంకనం చేయాలి. వాటికి విష్ణు నామాలను పెట్టాలి. బంగారంతో చేయబడిన పంచాయుధాలను పిల్లల కంఠానికి అలంకరించాలి.

పెరియాళ్వార్లు శ్రీకృష్ణుని గురించి చెప్పేటప్పుడు "శెంగమలక్కழలిల్ విరలిల్ శేర్ ఆழிకళుమ్ కింకిణియుమ్, అరైయిల్ తంగియ పొన్ వడముమ్ తాళ నన్మాదుళైయుమ్ పూవోడు పొన్ మణియుమ్ మోదిరముమ్ కిజియుమ్, మంగలమ్ ఐంబడైయుమ్ తోళ్ వళైయుమ్ కుழையுయుమ్మకరముమ్ వాళికళుమ శుట్టియుమ్ ముత్తిలక" అని అనుగ్రహించారు. మంగళకరమైన పంచాయుధాలను శ్రీకృష్ణుని మెడలో అలంకరించినట్లు ఈ పాశురంలో వారు అనుగ్రహించారు.

వశిష్ఠ స్మృతిలో కూడా ఈ విధంగానే చెప్పబడింది.

ఇక, శంఖచక్రాంకనాన్ని గూర్చిన కొన్ని ఇతిహాసాలను చూద్దాం. విష్ణుధర్మంలోని 82 వ అధ్యాయంలో యమకింకర సంవాదం ఒకటి కనిపిస్తుంది. ఈ విధంగానే, విష్ణుపురాణం, మాత్స్య పురాణం మొదలైనవానిలో చక్రాంకన వైభవం విశేషంగా తెలుపబడింది.

పంచమ వేదంగా చెప్పబడే మహాభారతంలో వ్యాస మహర్షి –

"బ్రాహ్మణైః క్షత్రియైః వైశ్యైః శూద్రైశ్చ కృత లక్షణైః,
అర్చనీయశ్చ సేవ్యశ్చ"

అనే ఒక వాక్యాన్ని అనుగ్రహించారు. ఇక్కడ "కృత లక్షణైః" అనే ప్రయోగం చక్రాంకనం చేసుకున్న వారిని తెలుపుతుంది.

పాంచరాత్ర ఆగమానికి సంబంధించిన పారమేశ్వర సంహిత, శ్రీవిష్ణుతత్త్వం పరాశరసంహిత, నారదీయ పద్ధతి, సనత్కుమార సంహిత మొదలైన గ్రంథాలలో చక్రాంకనం చేసికోవడం ఆవశ్యకమని తెలుపబడింది. శ్రీమద్భాగవతం, పాద్మం, బ్రహ్మకైవర్తం, స్కాందం, వామనం, గారుడం మొదలైన పురాణాలలో కూడా ఈ విధంగానే అని చెప్పబడింది.

హరివంశం మహాపురాణంలోని 147వ అధ్యాయంలో శ్రీకృష్ణుడు యాత్రకు వెళ్ళేటప్పుడు అతడు చెప్పిన వాక్యంగా ఒక శ్లోకం కనిపిస్తున్నది.

"చక్రాంకితాః ప్రవేష్టవ్యాః యావదాగమనం మమ,
నాముద్రితాః ప్రవేష్టవ్యాః యావదాగమనం మమ".

చక్రాంకనం చేసుకొన్న వారిని మాత్రమే ద్వారకా నగరంలోకి అనుమతించాలి. నేను తిరిగి వచ్చేంతవరకు చక్రాంకనం చేసికోనివారిని అనుమతించకూడదు –అనే శ్రీకృష్ణుడు చెప్పిన సందర్భంలోనిది ఈ వాక్యం.

దీనివల్ల ఏమి తెలుస్తున్నది? అని అంటే, చక్రాంకనం చేసుకొనేవారు భగవంతుని నగరంలో ప్రవేశించడం కాదు – అని తెలుస్తున్నది.

ఇంతవరకు సంగ్రహంగా తెలుపబడిన విషయాలనుబట్టి తప్తశంఖచక్రాంకనం అనేది శ్రీవైష్ణవులకు తప్పక ఆవశ్యకం– అనే విషయం తెలుస్తున్నది.

"శంఖం, చక్రంవంటి ఆయుధాలను ధరించడానికి మేము ఒప్పుకుంటాము. అయితే, వాటిని హోమాగ్నిలో తప్తం చేసి, ఇతరుల శరీరాలలో ముద్రించడం ద్వారా వారిని గాయపరచడాన్ని మేము ఆక్షేపిస్తున్నాము"– అని కొందరు ఆక్షేపాన్ని లేవనెత్తారు.

దీనికి సమాధానం ఏమంటే– ఇంతకుముందు ప్రస్తావింపబడిన పలు ప్రమాణాలు హోమాగ్నిలో తప్తం చేసిన శంఖచక్రాలతో అంకనంచేసి కోవడం శాస్త్రీయమైన విధి –అనే విషయాన్ని స్పష్టంగా తెలియజేస్తున్నాయి. ఇవి అన్ని సంస్కృతంలో ఉండే ప్రమాణాలు. ఇవేకాక, దివ్యసూరుల దివ్య సూక్తులలో కూడా తప్తచక్రాంకనాన్ని గూర్చిన చాలా ప్రమాణాలు కనిపిస్తున్నాయి.

"తీయిల్ పొలిగిన్ఱ శెంజుడరాழி తికழ் తిరుచ్చక్కరత్తిన్ కోయిల్ పొఱియాలే ఒత్తుండు నిన్ఱు కుడి కుడి ఆళ్ శెయ్ కిన్ఱోమ్"

అని అంటున్నారు పెరియాళ్వార్లు. వారు. తమ ప్రబంధంలోని చివరి దశకంలో కూడా " ఉన్ శక్కర ప్పొఱి ఒత్తిక్కొండు నిన్నరుళే పురిందిరుందేన్" అని అంటున్నారు. వీటివల్ల తప్తం చేయబడిన శంఖచక్రాలతోనే శంఖచక్రాంకనాన్ని చేసుకోవాలి– అని స్పష్టమవుతున్నది.

కొన్ని వైష్ణవ సంప్రదాయాలలో తాపసంస్కారం వేరు విధంగా కనిపిస్తున్నదే!వారు శంఖచక్రాలతో సంస్కారాన్ని చేసుకోవడంలేదు. రామానంద సంప్రదాయంలో విల్లుబాణాలతో తాప సంస్కారాన్ని చేసుకుంటున్నారు. మధ్వ సంప్రదాయంలో

శంఖచక్రాలు మాత్రమే కాకుండా పంచాయుధాలతో సంస్కారాన్ని చేసుకుంటున్నా రు. కాని, నాథమునులనుండి ఆరంభింపబడిన మన సంప్రదాయంలో అయితే, కుడి భుజం లో చక్రాన్ని, ఎడమ భుజంలో శంఖాన్ని మాత్రమే అంకనం చేసుకుంటున్నాము. శిష్టులైన మన పూర్వాచార్యుల అనుష్ఠానమే మనకు ప్రమాణం.

భుజాలలో ముద్రింపబడిన శంఖచక్రాల గుర్తులు కొన్ని కొంతకాలం తరువాత కనపడకుండా పోయినట్లయితే, ఆ సంస్కారాన్ని మళ్లీ చేసుకోవాలా? అని అంటే, ఆ అక్కరలేదు. ఈ తాపం అనేది ఒక సంస్కారం అయినందున ఒక్కసారి చేసుకుంటే చాలు. శరీరం ఉన్నంతవరకు అది సరిపోతుంది.

యాగంలో ఉపయోగించే పురోడాశానికి ఉపయోగించే ధాన్యానికి, " వ్రీహీనవహంతి" అని చెప్పబడిన సంస్కారం ఒక పర్యాయం చేస్తే చాలదు. ధాన్యంపై ఉండే ఊకపోయేంతవరకు దానిని దంచాలి– అని చెప్పబడింది కదా. ఆ విధంగానే, శంఖచక్రాల గుర్తులు కనపడకుండా పోయినప్పుడు మళ్లీ తిరిగి ఆ సంస్కారాన్ని చేసుకోవాలి కదా? అని అంటే, ఆ విధంగా అక్కరలేదు. సంస్కారాలు దృష్ట సంస్కారాలు అని అదృష్ట సంస్కారాలు అని రెండు విధాలుగా ఉంటాయి. ఇంతకుముందు చెప్పబడిన ధాన్యాన్ని దంచే సంస్కారం దృష్ట సంస్కారం అనబడుతుంది. అంటే, కంటికి కనిపించే సంస్కారం. యాగంలో ఉపయోగించే పురోడాశానికి ఉపయోగపడే ధాన్యం పైన ఉండే పొర తొలగిపోతేనే, దానిని పిండి చేసి కుర్రోడాశాన్ని నిర్మించడానికి వీలవుతుంది. అందుచేత ఆ ధాన్యం పై ఉండే ఊక పోయేంతవరకు మాటిమాటికి దంచవలసిన అవసరం ఉన్నది. కాని, ప్రోక్షణం అనేది అదృష్ట సంస్కారం. అక్కడ చెప్పబడిన "వ్రీహీన్ ప్రోక్షతి" అనే ప్రోక్షణ సంస్కారం ఒక్కసారి చేస్తే చాలు. ఆ విధంగానే తాప సంస్కారం అనేది అదృష్ట సంస్కారంగా ఒక్కసారి చేస్తే చాలు. "సకృత్ కృతః శాస్త్రార్థః" అనే విధంగా ఒక్కసారి చేసుకుంటేనే చాలు.

## తాప సంస్కారాన్ని చేయడానికి ఏ అగ్నిని ఉపయోగించాలి?

శాస్త్రాలలో విధింపబడిన కర్మలను చేయడానికి రెండు విధాలైన అగ్నులను వైదికులు ఉపయోగిస్తున్నారు. అగ్నిహోత్రం, దర్శపూర్ణ మాసం మొదలైన శ్రౌత కర్మలను చేయడానికి త్రేతాగ్ని అనబడే మూడు అగ్నులను ఉపయోగిస్తున్నారు. ఆ అగ్నులను ఆధానం చేసి, వాటిలో శ్రౌత కర్మలను చేయాలి. స్మృతులలో మొదలైన వాటిలో చెప్పబడిన కర్మలను చేయడానికి, అంటే, ఔపాసనం, స్థాలీపాకం మొదలైన కర్మలను చేయడానికి ఉపయోగించే అగ్ని తమ తమ గృహ్యసూత్రాలలో చెప్పబడిన రీతిలో అగ్ని సంధానం అనే విధంగా అగ్నిని సంధానం చేసి, ఆ అగ్నిలో స్మృతులలో చెప్పబడిన కర్మలను ఆచరించాలి. అయితే, పంచ సంస్కారానికి ఆవశ్యకమైనది వైష్ణవాగ్ని. వైష్ణవీకరణం అనే క్రమానుసారంగా లౌకికాగ్నిని, వైష్ణవాగ్నిగా చేసి, అందులో శ్రీపాంచరాత్రంలో చెప్పబడిన క్రమంలో హోమం చేసి, ఆ అగ్నిలో శంఖ చక్రాలను బాగా వేడి చేసి, వాటితో తాప సంస్కారాన్ని చేయాలి.

ఇవి తాప సంస్కారానికి సంబంధించిన సంగ్రహవిశేషాలు

## 2) పుండ్ర సంస్కారం

నుదురు మొదలైన శరీర భాగాలలో ధరింపబడే గుర్తు పుండ్రం అని అనబడుతుంది. ఈ పుండ్రాన్ని రెండు విధాలుగా ధరిస్తున్నారు. కొందరు ధరించే పుండ్రం క్రింద నుండి పైకి నిలువుగా ధరింపబడుతుంది. మరి కొందరు అడ్డంగా ధరిస్తారు. ఊర్ధ్వదిశగా ధరింపబడేది ఊర్ధ్వపుండ్రమని, అడ్డంగా ధరింపబడే పుండ్రం తిర్యక్ పుండ్రమని చెప్పబడతాయి. విష్ణు భక్తులు, అంటే, వైష్ణవులు ఊర్ధ్వపుండ్రాన్ని ధరిస్తారు. మిగిలిన వారు తిర్యక్ పుండ్రాన్ని ధరిస్తారు. చిన్న వయస్సు నుండి పుండ్రాలను ధరిస్తూ ఉన్నప్పటికీ, పంచ సంస్కారాన్ని పొందే సమయంలో ఆచార్యుని వద్ద నుండి పుండ్రాన్ని ఒక సంస్కారరూపంగా పొందడం జరుగుతుంది. దీనికి పుండ్ర సంస్కారం అని పేరు. ఇదిపంచ సంస్కారాలలో రెండవ సంస్కారం. శంఖచక్రాలను ధరించడం వల్ల విష్ణువునకు

దాసుడు అవుతున్నాడు. తనకు స్వామి అయిన విష్ణువును ఆరాధించడంకోసం ఊర్ధ్వపుండ్రాలను తప్పక ధరించాలి. తిర్యక్ పుండ్రం ధరించడం గాని, పుండ్రాన్ని ధరించకుండా ఉండడం గానీ చేయకూడదు. ఎందుకంటే, ఊర్ధ్వపుండ్రం ధరించకుండా చేసే ఏ పని అయినా ఉపయోగం లేనివి అని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. ఈ విషయంలో కొన్ని ప్రమాణాలను గమనిద్దాం.

మహోపనిషత్ ఈ విధంగా తెలుపుతున్నది.

"ధృతోర్ధ్వపుండ్రః పరమేశితారం
నారాయణం సాంఖ్యయోగాధిగమ్యమ్,
జ్ఞాత్వా విముచ్యేత నరః సమస్తైః
సంసార బాధై రిహ యాతి విష్ణుమ్"

ఊర్ధ్వపండ్రాలను ధరించి, నారాయణుడైన విష్ణువును ధ్యానించేవాడు సంసార బాధలనుండి విముక్తుడు అవుతున్నాడు.

కరశాఖలో చెప్పబడిన "ధృతోర్ధ్వ పుండ్రః కృతచక్రధారీ" అనే మంత్రం ఇంతకు ముందే వివరింపబడింది.

అధర్వణ శ్రుతిలో

"హరేః పాదాకృతిమ్ ఆత్మనో హితాయ మధ్యే ఛిద్ర మూర్ధ్వపుండ్రం యో ధారయతి, స పరస్య ప్రియో భవతి, స పుణ్యవాన్ భవతి, స ముక్తి భాక్ భవతి"

అని చెప్పబడుతున్నది. దీని అర్థం ఏమంటే,

విష్ణు యొక్క పాదం ఆకృతిలో ఊర్ధ్వపుండ్రాన్ని తన క్షేమం కోసం ఎవడు మధ్యలో విభాగింపబడిన ఆకృతిలో ధరిస్తున్నాడో, అతడు భగవంతునకు చాలా ఇష్టమైనవాడు

అవుతున్నాడు. అతడు పుణ్యశాలి అవుతున్నాడు. అతడు ముక్తిని పొందేవాడు అవుతున్నాడు.

**ఈ ఊర్ధ్వపుండ్రాన్ని దేనితో ధరించాలి? అనేది ప్రశ్న.**

ఈ ఊర్ధ్వపుండ్రాన్ని ధరించేవారు కొందరు శ్వేత మృత్తికను ఉపయోగిస్తున్నారు. కొందరు పసుపు పచ్చని రంగును కలిగిన గోపీచందనాన్ని ఉపయోగిస్తున్నారు. మరి కొందరు చందనంతోనే ఈ ఊర్ధ్వపుండ్రాన్ని ధరిస్తున్నారు. వల్లభ సంప్రదాయానికి చెందినవారు ఎర్రని రంగును కలిగిన ఊర్ధ్వపుండ్రాన్ని ధరిస్తున్నారు. ఈ విధంగా పలు విధాలైన వస్తువులను ఊర్ధ్వపుండ్రాన్ని ధరించడం కోసం ఉపయోగిస్తున్నారు.

**శ్రీవైష్ణవులు దేనితో ఊర్ధ్వపుండ్రాన్ని ధరించాలి?**

పైన తెలుపబడిన వస్తువులను ఉపయోగించి ఊర్ధ్వపుండ్రాన్ని ధరించవచ్చు అని శాస్త్రాలు చెబుతూ ఉన్నప్పటికీ, మోక్షంలో ఇచ్ఛ కలిగినవారు తెల్లని రంగును కలిగిన మృత్తికను ఉపయోగించి ఊర్ధ్వపుద్రాన్ని ధరించాలి –అని శాస్త్రాలు తెలియజేస్తున్నాయి. మన పూర్వాచార్యుల అనుష్ఠానం వల్ల మనం శ్వేత మృత్తికను ఉపయోగించే ఊర్ధ్వపుండ్రాలను ధరించాలి.

**ఎన్ని ఊర్ధ్వపుండ్రాలను ధరించాలి?**

నుదుటి భాగంలో తప్పక ఊర్ధ్వపుండ్రం ధరించాలి. ఇక్కడే కాకుండా, శరీరంలో మిగిలిన నిర్దేశింపబడిన భాగాలలో కూడా ఊర్ధ్వపుండ్రాలు ఉండాలి. వీటికి ద్వాదశోర్ధ్వపుండ్రాలు, పన్నెండు నామాలు అని పేరు.

## ద్వాదశోర్ధ్వపుండ్రాలను శరీరంలో ఎక్కడ ఎక్కడ ధరించాలి?

మొదట కొంచెం శ్వేతమృత్తికను తలపై ధరించి, తరువాత నుదుటిలోనూ, తరువాత క్రమంగా కుక్షి మధ్య భాగంలో, వక్షఃస్థలంలో, కంఠం మధ్య భాగంలో, కుక్షి కుడి వైపున, కుడి భుజంలో, కంఠం కుడి వైపున, కుక్షి ఎడమవైపున, ఎడమ భుజంలో, కంఠం ఎడమవైపున, నడుము వెనుక వైపు, కంఠం వెనుక వైపు— ఈ విధంగా శరీరంలో 12 స్థానాలలో ఊర్వ్వపుండ్రాలను ధరించాలి.

ఈ విధంగా 12చోట్ల పుండ్రాలను ధరించే అవకాశం లేకపోయినా, "పుండ్రేషు కేశవం దామోదరం చ న పరిత్యజేత్" అనే శాస్త్రవచనానుసారంగా నుదుటి భాగంలోనూ, కంఠం వెనుక వైపు తప్పక ఉండ్రాన్ని ధరించాలి.

సమాశ్రయణ కాలంలో పైన తెలుపబడిన 12 స్థానాలలో పుండ్రాలను ధరింపజేసి, వాటికి తగిన మంత్రాలను, ధ్యానించే క్రమాన్ని ఆచార్యులు ఉపదేశిస్తారు. దీనికి పుండ్ర సంస్కారమనే రెండవ సంస్కారం అవుతున్నది.

## తిరుమణ్ కాప్పును ధరించడానిని అనుసంధించే మంత్రాలు ఏవి?

కేశవుని నుండి ఆరంభించి దామోదరుని వరకు ఉండే వ్యూహ మూర్తులు 12 మంది 12 ఊర్ధ్వపుండ్రాలకు అధిదేవతలు. "ఓం కేశవాయ నమః "అని నుదుటి భాగంలోను, "ఓం నారాయణాయ నమః " అని కడుపు మధ్య భాగంలోనూ, " ఓం మాధవాయ నమః" అని వక్షఃస్థలంలోనూ, " ఓం గోవిందాయ నమః" అని కంఠం మధ్య భాగంలోనూ, " ఓం విష్ణవే నమః" అని కడుపు కుడివైపున, " ఓం మధుసూదనాయ నమః "అని కుడివైపు భుజంలో, ", ఓం త్రివిక్రమాయ నమః " అని కంఠం కుడి వైపున, " ఓం వామనాయ నమః "అని కడుపు ఎడమవైపున, " ఓం శ్రీధరాయ నమః" అని ఎడమ భుజంలో, "ఓం హృషీకేశాయ నమః "అని కంఠం ఎడవవైపున, " ఓం పద్మనాభాయ నమః "అని నడుము వెనుక వైపున, " ఓం దామోదరాయ నమః" అని కంఠం వెనుక వైపున పుండ్రాలను ధరించాలి.

పెరియాళ్వార్ తిరుమొళ్గిలో రెండవ శతకంలోని"పోయ్ ప్పాడుడైయ" అనే రెండవ దశకంలో, నమ్మాళ్వారుల తిరువాయ్ మొళ్గి ప్రబంధంలోని రెండవ శతకం "కేశవన్ తమర్" అనే ఏడవ దశకంలో, "పన్నిరునామమ్" అనే శ్రీ దేశికుల ప్రబంధంలోనూ ఈ 12 నామాలను వరుసగా మనం దర్శించవచ్చు.

**కేశవుడు మొదలైన 12 మంది వ్యూహమూర్తులను ఏ విధంగా ధ్యానించాలి?**

"చతుశ్చక్రం నమస్యామి" అని మొదలైన మంత్రాలతో ఈ మూర్తులను ధ్యానం చేయాలి.

శ్వేత మృత్తిక నడుమ శ్రీ చూర్ణం ధరించడం సంప్రదాయం. కేశవాది 12 మంది వ్యూహమూర్తులను ఆయా మంత్రాలతో అవాహన చేసి ధ్యానిస్తూ, శరీరంలో ఆయా స్థానాలలో తిరుమణ్ కాప్పును ధరించినట్లే, ఆ 12 చోట్ల శ్రీ చూర్ణాన్ని ధరించేటప్పుడు లక్ష్మిని ఆయా తిరునామాలతో ఆవాహన చేసి ధ్యానించాలి. "శ్రియై నమః" మొదలైన మంత్రాలతో లక్ష్మీదేవిని ధ్యానించాలి. ఎందుకంటే, "అగలకిల్లేన్ ఇఱైయుమెన్ఱు" అనే విధంగా లక్ష్మీదేవి నారాయణుని విడచి ఏ సమయంలోను ఉండదు కదా. ఇంకతేకాక, లక్ష్మీనారాయణులు అనే ఒక మిథునమే మనకు ఉపాయం, ఉపేయంకూడా. వారే మనకు సాధనం, ప్రయోజనం కూడా. అందుచేత వీరిద్దరిని విడదీయరాదు. ఇందువల్ల లక్ష్మీదేవికి చిహ్నమైన శ్రీ చూర్ణాన్ని శ్వేత మృత్తికపుండ్రం మధ్యలో ధరించి, అక్కడ లక్ష్మీదేవిని ఆవాహన చేసి, ధ్యానించాలి.

శ్రీ చూర్ణంల ధరించేటప్పుడు "ఓమ్ శ్రియై నమః" అని నుదుటిలోనూ, ", ఓం అమృతోద్భవాయై నమః" అని కడుపు మధ్య భాగంలోను, "ఓం కమలాయై నమః" అని వక్షఃస్థలంలోనూ, "ఓం చంద్ర శోభిన్యై నమః" అని కంఠం మధ్య భాగంలోనూ, (" ఓం చంద్ర సోదర్యై నమః @అని కూడా కొందరు చెబుతారు), "ఓం విష్ణుపత్న్యై నమః "అని కడుపు కుడి వైపున, " ఓం వైష్ణవ్యై నమః" అని కుడి భుజంలోను, "ఓం వరారోహాయై నమః " అని కంఠం కుడి వైపున, " ఓం హరివల్లభాయై నమః" అని కడుపు ఎడమవైపున, " ఓం శార్

జ్ఞైన్యై నమః "అని ఎడమ భుజంలోను, "ఓం దేవదేవ్యై నమః" అని కంఠం ఎడమవైపున, " ఓం మహాలక్ష్మ్యై నమః" అని నడుము వెనకవైపున. "ఓం లోక సుందర్యైనమః "అని కంఠం వెనుక వైపున లక్ష్మీ నామాలను అనుసంధానం చేస్తూ శ్రీచూర్ణాన్ని ధరించాలి.

**ధరించే పుండ్రం యొక్క ఆకారం ఏ విధంగా ఉండాలి?**

శ్రీ పాంచరాత్రానికి సంబంధించిన సంహితలలో ఊర్ధ్వపుండ్రం ఆకారం ఏ విధంగా ఉండాలి? అనే విషయాన్ని గురించి విశధంగా తెలియజేయబడింది. సచ్చరిత్ర రక్ష అనే గ్రంథంలోను, ఊర్ధ్వపుండ్ర ధారణ విధి అనే గ్రంథంలోని రెండవ భాగంలోను వేదాంత దేశికులు ఊర్ధ్వపుండ్రాన్ని ఏ విధంగా ధరించాలి? అనే విషయాన్ని గురించి ప్రస్తావన చేసి, చాలా విస్తృతంగా విచారించి, హరి పాదాకృతిలో, అంటే, భగవంతుని శ్రీచరణాకారంగా ఉండే పుండ్రాన్ని శ్వేత మృత్తికతో ధరించాలని నిర్ణయించారు. అందుచేత, మనం ధరించే పుండ్రం కూడా ఆ విధంగానే ఉండాలి.

**శ్వేత మృత్తికతో ధరించే పుండ్రానికి మధ్యలో అవకాశం ఉండాలా? అక్కడ తప్పక శ్రీచూర్ణాన్ని ధరించాలా?**

అవును, తప్పక ఉండాలి. అది లక్ష్మీదేవి స్థానం. అందుచేత శ్వేతమృత్తికతో ధరించే పుండ్రానికి మధ్యలో ఉండే అవకాశంలో శ్రీచూర్ణాన్ని తప్పక ధరించాలి.

వరాహ పురాణంలో

" ఏకాంతినో మహాభాగాః మత్ స్వరూపవిదో పరాః,
సాంతరాలాం ప్రకుర్వీరన్. పుండ్రాం నో వరాకృతీమ్,
రక్షార్థం మంగళార్థం చ పవిత్రార్థం వరాననే!,
మంత్రముచ్చార్య విధివత్ ధారయేదూర్ధ్వపుండ్రకాన్"

అనే వచనం కూడా పై విషయాలను దృఢపరుస్తున్నది. ఈ విధంగా అనేక పురాణ వచనాలు సచ్చరిత్ర రక్షలో తెలుపబడిన దానినిబట్టి శ్రీవైష్ణవులు శ్వేత మృత్తికతో ఊర్ధ్వపుండ్రాన్ని ధరించాలి– అని, దాని మధ్యలో శ్రీచూర్ణాన్ని ధరించాలి– అని తెలుస్తున్నది.

## శ్రీ చూర్ణం ఏ విధంగా ఉండాలి? ఏ విధంగా తయారు చేయాలి?

శ్రీవైష్ణవులలో ఒక తెగవారు పసుపు పచ్చని రంగును కలిగిన శ్రీచూర్ణాన్ని ధరిస్తారు. ఇంకొక తెగకు చెందినవారు ఎర్రని రంగును కలిగిన శ్రీ చూర్ణాన్ని ధరిస్తారు. ఈ రెండు శిష్టాచారాలే. ఈ రెండు ఆచారాలకు తగిన ప్రమాణాలు ఉన్నాయి. అందుచేత వారి వారి సంప్రదాయాలను అనుసరించి దానికి తగినట్లుగా పసుపు పచ్చని శ్రీచూర్ణాన్ని కానీ, ఎర్రని రంగును కలిగిన శ్రీ చూర్ణాన్ని కానీ ధరించాలి.

ధరించే శ్రీ చూర్ణం ఎటువంటిది అయినా, దానిని పసుపులోనే తయారు చేయాలి. శ్రీ చూర్ణాన్ని చేసిన తరువాత దానిని ప్రతిష్ఠ చేసి, దానిని భగవంతుని మూర్తికి సమర్పించిన తరువాతనే మనం ధరించాలి. జాతాశౌచమృతాశౌచసమయాలలో ప్రతిష్ఠను చేసిన శ్రీచూర్ణాన్ని తాకరాదు.

సంగ్రహంగా ఇవి పుండ్ర సంస్కారానికి సంబంధించిన విషయాలు.

## 3)నామ సంస్కారం

ఇక, పంచ సంస్కారాలలో మూడవది అయిన నామ సంస్కారం అంటే ఏమి? అనే విషయం సంగ్రహంగా ప్రస్తావింపబడుతున్నది.

ఒక బిడ్డ జన్మించినప్పుడు నామకరణం అనే ఒక సంస్కారాన్ని చేయాలి. పేరు పెట్టడం అని దీనికి అర్థం. నామకరణ సంస్కార సమయంలో పెట్టబడిన పేరే ఆ వ్యక్తికి జీవితాంతం నిలచి ఉంటుంది. అదే స్థిరంగా ఉండే నామం అవుతుంది. ఆ వ్యక్తిని గూర్చి చేయబడే వైదిక సంస్కారాలలో ఆ పేరే ప్రస్తావింపబడాలి అనేది శాస్త్రం.

శ్రీవైష్ణవ సంప్రదాయానికి చెందినవారు భగవంతుని నామాలనే తమ సంతానానికి నామాలుగా పెట్టుకోవాలి. అన్య దేవతల నామాలను వారు తమ సంతతికి పెట్టుకోరాదు. పంచ సంస్కారాన్ని పొందే సమయంలో కూడా ఆచార్యులు తన శిష్యులకు ఒక పేరును పెట్టాలి. ఆ నామం దాస్య నామం అనబడుతుంది. భగవంతుని వాచకమైన ఒక నామంతో, "దాసన్" అనే పదాన్ని చేర్చిన పేరును పెట్టడమే దాస్య నామాన్ని పెట్టడం అవుతుంది. నారాయణుడు అని ఒకరి పేరు అయితే, నారాయణ దాసన్ అనేది అతనికి దాస్యనామం అవుతుంది. తమకు ఇష్టమైన భగవంతుని నామాలుగానో, ఆచార్యుల నామాలుగానో ఇవి ఉండవచ్చును. రంగనాథ దాసన్, వరద దాసన్, శ్రీనివాస దాసన్ —అని ఈ విధంగా ఉండేవి శ్రీవైష్ణవుల దాస్య నామాలు అవుతాయి.

శ్రీవైష్ణవుడు భగవంతునకు దాసుడై ఉండడంతో పాటు, భాగవతులకు, ఆచార్యులకు కూడా దాసుడు అవుతున్నాడు. ఆచార్యులలో ముఖ్యులు భగవద్రామానుజులు. వారికి ముందు అవతరించిన ఆచార్యులు శ్రీ రామానుజుల శిరఃసంబంధంచేత, వారికి తరువాత అవతరించిన పూర్వాచార్యులు వారి శ్రీచరణ సంబంధంచేత గొప్పతనాన్ని పొందుతున్నారు. ఈ విషయాన్ని "తత్పాద కోటీరయోః సంబంధేన సమిధ్యమాన విభవాన్" అని అంటూ శ్రీదేశికులు యతిరాజసప్తతి అనే స్తోత్రంలో అనుగ్రహించారు. " అమునా తపనాతిశాయి భూమ్నా యతిరాజేన నిబద్ధనాయకశ్రీః, మహతీ గురుపంక్తిహారయష్టిః విబుధానాం హృదయంగమా విభాతి " అనే యతిరాజసప్తతి శ్లోకం వల్ల కూడా ఈ విషయం స్పష్టమవుతుంది. అందుచేత ఆచార్యులలో ప్రధానులైన భగవద్రామానుజుల తిరునామాన్ని కూడా చేర్చి ఆచార్యులు "రామానుజ దాసోఽసి" అని అనగా, శిష్యుడు కూడా "రామానుజ దాసోఽస్మి "అని అంటాడు. శ్రీ వైష్ణవులు ఒకరికొకరు అభివాదనం చేసికునేటప్పుడు "అడియేన్ రామానుజ దాసన్" అని తమను నిర్దేశించుకునే సంప్రదాయం కూడా దీనివల్లనే ఏర్పడింది. ఇంతకు ముందే భగవాన్నామంగానో, ఆచార్య నామంగానో ఉండే నామాన్ని సమాశ్రయణకాలంలో ఆ నామాన్ని మార్చకుండా, ఆ నామాన్ని

పురస్కరించుకొని, దానికి "దాసన్ " అనే నామాన్ని చేర్చి, "శ్రీనివాస రామానుజ దాసోస్మి" అని ఈ విధంగా అంటారు. ఆ విధంగా కాకుండా, సాధారణంగా నామం ఉన్నట్లయితే, దానిని మార్చి భగవాన్నామంతోనో, ఆచార్య నామంతోనో దాస్యనామాన్ని కూడా కలిపి పేరును పెడతారు. దీనికే నామ సంస్కారం అని పేరు.

చిన్నపిల్లలకు భగవంతుని నామాన్ని పేరుగా పెట్టాలి– అనే సంప్రదాయం ఎందుకోసం వచ్చింది? ఒక వ్యక్తిని నిర్దేశించాలంటే ఏదో ఒక పేరు ఉండాలి, అంతే కదా. దేవతాంతర నామంగానో, పిచ్చయ్య, వెర్రియ్య, పెంటయ్య అని ఈ విధంగానో పేర్లు ఉన్నట్లయితే ఏమి నష్టం? అని కొందరు అడగవచ్చు. దీనికి సమాధానం వినండి.

సూర్యవంశంలో అజామిళుడు అనే ఒక రాజు ఉండేవాడు. అతడు జీవితాంతం పాప కృత్యాలనే చేశాడు. అతడు తన చివరి కుమారునకు నారాయణుడు అనే పేరు పెట్టుకున్నాడు. తన చివరి కాలంలో తన చివరి కుమారుని పేరు పెట్టి పిలుస్తూ, "నారాయణా!" అని అన్నాడు. అతని ప్రాణం పోయిన తరువాత అతని ఆత్మను తీసుకొని పోవడం కోసం యమకింకరులు అతని దగ్గరకు వచ్చారు. మరొకవైపు విష్ణు కింకరులు కూడా వచ్చారు. అప్పుడు రెండు వర్గాల వారికి వివాదం ఏర్పడింది. "జీవితంలో అంతా కేవలం పాపపు పనులను చేసిన ఇతని ఆత్మను మేమే తీసుకుని పోవాలి" అని యమకింకరులు అన్నారు. " ఒక పర్యాయం వీడు నారాయణాన్ని ఉచ్చరించాడు, అందుచేత ఇతడు చేసిన అన్ని పాపాలు నశించిపోయాయి. అందుచేత మేము మాత్రమే ఇతనిని తీసుకొని పోవాలి. మేము ఇతనిని విష్ణు లోకానికి తీసుకుని పోతాము "అని విష్ణుభటులు అన్నారు. చివరకు విష్ణుభటుల మాట నెగ్గి, వారు అతనిని విష్ణులోకానికి తీసికొని పోయారు –అనేది పౌరాణిక వృత్తాంతం. ద్రౌపదికి ఆపత్సమయంలో వస్త్ర దానం చేసి, ఆమె మానాన్ని రక్షించినది భగవాన్నామమే కదా. తొండరడి పొడి ఆళ్వార్లు కూడా

"కావలిల్ పులనై వైత్తు క్కలి తన్నై క్కడక్క ప్పాయ్ న్దు
నావలిట్టుழி తరుగిన్ఱోమ్ నమన్ తమర్ తలైగళ్ మీదే,
మూవులగు ఉణ్డుమిழ்న్ద ముదల్వ! నిన్ నామమ్ కற்ற
ఆవలిప్పుడైమై కణ్డాయ్ అరంగమా నగరుళానే! °

అని అన్నారు.

శ్రీ దేశికులు కూడా

"ఇతీవ శుభదాని యః పఠతి నామధేయాని తే, న తస్య యమవశ్యతా నరకబాధభీతిః కుతః"

అని అన్నారు. ఈ విధంగా భగవంతుని నామాలను అనుకోకుండా చెప్పినప్పటికీ కూడా, అపూర్వమైన ఫలం దక్కుతుంది. కనుక, తమ చిన్న పిల్లలకు తల్లిదండ్రులు భగవంతుని నామాలను వారికి పేర్లుగా పెట్టడం అనేది సంప్రదాయమైనది.

పెరియాళ్వార్లు కూడా "కాశుమ్ కఱైయుడై క్కూఱైక్కుమ్" (4—6)అనేదశకంలో లోకంలోనివారిని ఉద్దేశించి "మీ బిడ్డలకు శ్రీమన్నారాయణుని శుభనామాలనే పెట్టండి. ఆ విధంగా మీరు చేసినట్లయితే, మిమ్ములను ఆ స్వామి నరకంలోకి ప్రవేశించకుండా కాపాడుతాడు" అని అన్నారు. భగవంతుని తిరునామాలను బిడ్డలకు పెట్టిన తల్లి నరకంలోకి పోనే పోదు. అందుచేత ఇంతకు ముందు పెట్టిన పేరు ఏ విధంగా ఉన్నప్పటికీ, సమాశ్రయణ కాలంలో దాస్య నామాన్ని పెట్టాలి. అదే మనకు ఉజ్జీవనం.

## 4) మంత్ర సంస్కారం

పంచ సంస్కారాలలో నాలుగవ సంస్కారం మంత్ర సంస్కారం. మంత్రాలను ఆచార్యుల ద్వారా మాత్రమే గ్రహించాలి. ఆచార్యుని ద్వారా ఉపదేశంగా పొందని మంత్రం ఫలాన్ని ఇవ్వదు. మంత్రాలు కోట్ల సంఖ్యలో ఉన్నాయి. ఆ మంత్రాలను

అన్నిటిని ఎవడు కూడా తెలిసికోవడం సాధ్యం కాని పని. ఇంతే కాక, దేవతాంతర మంత్రాలు శ్రీవైష్ణవునకు ఆవశ్యకాలు కాదు.

భగవన్మంత్రాలలో మూడిటిని మాత్రం ప్రపన్నుడు ఆచార్యుని ద్వారా తెలుసుకోవాలి. అవి ఏమంటే, అష్టాక్షరి అనబడే తిరుమంత్రం, ద్వయం, శ్రీకృష్ణ చరమ శ్లోకం అనే మూడు మంత్రాలు. మోక్షాన్ని పొందడంలో ఆశ కలిగిన ఒకడు తెలుసుకోవలసిన విషయాలు అన్నీ ఈ మూడు మంత్రాలలో అంతర్భవించి ఉన్నాయి. సమాశ్రయణ కాలంలో ఈ మూడు మంత్రాలను ఆచార్యులు తమ శిష్యులకు ఉపదేశిస్తారు. దీనికి మంత్ర సంస్కారం అని పేరు.

## రహస్య త్రయం అనబడే అష్టాక్షరి, ద్వయం, శ్రీకృష్ణ చరమ శ్లోకం అనే మూడు మంత్రాలలో ఉండే వివరణ ఏమి?

వీటిని గూర్చి పరాశలభట్టర్ అష్టశ్లోకి అనే ఒక గొప్ప స్తోత్రాన్ని అనుగ్రహించారు. తరువాత పలువురు ఆచార్యులు ఈ విషయంలో ఎన్నో గ్రంథాలను చాలా విస్తృతంగా అనుగ్రహించారు. శ్రీ పిళ్లై లోకాచార్యులవారు ముముక్షుప్పడి, పరందపడి, యాదృచ్ఛిక పడి మొదలైన ఎన్నో గ్రంథాలను అనుగ్రహించారు. శ్రీకృష్ణ సూరి అనబడే పెరియ వాచ్చాన్ పిళ్లై పరంద రహస్యం అనే గ్రంథాన్ని, అఴగియ మణవాళ జ్జీయర్ అనే ఆచార్యులు తత్వ దీపం. తత్వ ప్రకాశం అనే గ్రంథాలను రచించారు. దేశికులు కూడా రహస్య త్రయాల విషయంగా ఎన్నో గ్రంథాలను మణి ప్రవాళ భాషలో అనుగ్రహించారు. వాటిలో ముఖ్యమైనవి రహస్య త్రయసారం, రహస్య పదవి మొదలైన చిల్లర రహస్యాలు, తిరు మందిర చ్చురుక్కు, ద్వయచ్చురుక్కు, చరమ శ్లోక చ్చురుక్కు అనే ద్రావిడ ప్రబంధాలు. వీటి ద్వారా మనం రహస్య త్రయంలోని అర్థాలను స్పష్టంగా, వివరంగా తెలుసుకోవచ్చు. అయినప్పటికీ, రహస్య త్రయాన్ని గూర్చిన సంగ్రహంగా నివేదింపబడుతున్నది.

మూల మంత్రం అనే తిరు మంత్రం శ్రీ వైష్ణవులు తప్పక గ్రహించవలసిన మంత్రం. ఇది 8 అక్షరాలను కలిగి ఉన్నందున అష్టాక్షరి అనే పేరును కలిగినది అయినది. ఇందులో మూడు పదాలు ఉన్నాయి. అవి ప్రణవం, నమః శబ్దం, చతుర్ధీ విభక్తితో కూడిన నారాయణ శబ్దం. " సర్వమ్ అష్టాక్షరాంతఃస్థమ్" అనే సూక్తి ప్రకారం ఈ 8 అక్షరాలు కలిగిన తిరుమంతంలో అన్ని అర్థాలు ఇమిడి ఉన్నాయి. మోక్షాన్ని పొందగోరేవాడు తెలియవలసిన సమస్తార్థాలు అష్టాక్షరిలో ఇమిడి ఉన్నాయి. చిత్తు, ఆ చిత్తు, ఈశ్వరుడు– అనే మూడు తత్త్వాలు, తత్త్వ హిత పురుషార్థాలు, అర్థ పంచకం, అంటే, పొందవలసిన పరమాత్మ యొక్క స్వరూపం, ఆ పరమాత్మను పొందే జీవాత్మ యొక్క స్వరూపం, పరమాత్మను పొందడానికి తగిన ఉపాయం, పరమాత్మను పొందేటప్పుడు అడ్డుపడే విరోధాలు, పొందినప్పుడు పొందే ఫలం– అనే ఈ ఐదు అర్థాలు. వీటిని

"ప్రాప్యస్య బ్రహ్మణో రూపం ప్రాప్తుశ్చ ప్రత్యగాత్మనః,
ప్రాప్త్యుపాయం ఫలం తస్య తథా ప్రాప్తివిరోధి చ,
వదంతి సకలా వేదా సేతిహాసపురాణకాః,
మునయశ్చ మహాత్మానో వేదవేదార్థవేదినః"

అనే హారీత సంహితా వచనంలోనూ, "మిక్క ఇఱై నిలైయుమ్" అని మొదలవుతున్న తిరువాయ్ మొழி ప్రబంధతనియన్ పాశురంలోను సంగ్రహంగా సూచించడం జరిగింది. శ్రీమద్రహస్య త్రయసారంలోని మూల మంత్రాధికారంలో వేదాంతదేశికులు ఈ తిరు మంత్రంలోని అర్థాలను చాలా వివరంగా అనుగ్రహించారు.

రహస్య త్రయంలోని రెండవ రహస్యం ద్వయ మంత్రం. దీనిని ఆచార్యులు సమాశ్రయణకాలంలో ఉపదేశిస్తారు. కఠవల్లిలో వేరు వేరు సందర్భాలలో అధ్యయనం చేయబడుతున్న రెండు వాక్యాలను కలిపినపుడు ఈ మంత్రం సిద్ధించింది. ఇందులో, ఉపాయం, ఫలం –అనే రెండు విషయాలు వివరింప బడడంవల్ల ఈ మంత్రానికి ద్వయం అనే పేరు వచ్చింది. ప్రపత్తికి ఈ మంత్రమే ముఖ్యమని పెద్దలు అంటారు.

ఉపాయదశలోను, ఫలదశలోను లక్ష్మీసంబంధాన్ని స్పష్టంగా తెలియజేయడం వల్ల ఈ మంత్రాన్ని భగవద్రామానుజులు మొదలైన పూర్వాచార్యులు చాలా విశేషంగా కొనియాడారు. ప్రపన్నునకు ఈ ద్వయ మంత్రానుసంధానమే కాలక్షేపంగా ఉండాలి.

ఆచార్యుని సన్నిధిలో ఉపదేశంగా పొందవలసిన ఇంకొక మంత్రం శ్రీకృష్ణ చరమ శ్లోకం. దీనిని శ్రీకృష్ణుడు కురుక్షేత్ర భూమిలో అర్జునునకు ఉపదేశించాడు. ఇందులో ప్రపత్తి ఉపదేశింపబడుతున్నది. భక్తి యోగం అనబడే మోక్షోపాయాన్ని అనుష్ఠించడంలో శక్తి లేనివాడు తన ఆకించన్యాన్ని వ్యక్తం చేసి. ఈ శరీరం పతనం అయ్యేటప్పుడే ప్రారంభ్ధం, సంచితం అనబడే రెండు విధాలైన కర్మలను పోగొట్టుకొని, భగవంతుని అనుగ్రహం చేత ఆ స్వామి చరణాల సమీపానికి చేరి, నిత్య కైంకర్యాన్ని చేసుకోవాలి— అని ప్రార్థించడం ప్రపత్తి అవుతుంది. ఈ ప్రార్థనను అంగీకరించిన భగవంతుడు మనం మోక్షం పొందడానికి మనకు అడ్డుగా ఉండే పాపాలను అన్నిటి నుండి మనలను విడిపిస్తాడు. అందుచేత ప ప్రపత్తినిచేసినవాడు ఇక దేనికోసం విచారించవలసిన అక్కరలేదు.

భగవన్మంత్రాలు అనేకంగా ఉన్నప్పటికీ, రహస్య త్రయం అని చెప్పబడే ఈ మూడు ప్రపన్నులు తప్పక తెలుసుకోవలసినవి.

**5)యాగసంస్కారం**

పంచ సంస్కారాలలో చివరిది ఐదవది యాగ సంస్కారం. పంచ సంస్కారాలను చేసుకొన్నవాడే భగవంతుని ఆరాధించడానికి తగిన యోగ్యతను కలిగినవాడు అవుతాడు. భగవంతుని ఆరాధన చేసే క్రమాన్ని ఆచార్యులు ఉపదేశిస్తారు. ఈ సంస్కారానికి యాగ సంస్కారం అని పేరు. హృద్యాగం అని, బాహ్య యాగం అని ఆరాధన రెండు విధాలుగా ఉంటుంది. మనసులోనే భగవంతుని ఆరాధించడానికి హృద్యాగం అని, ఆంతరయాగం అని పేరు. ఆర్ఘ్యం, పాద్యం, ఆచమనీయం, గంధం,

పుష్పం, ధూపం, దీపం మొదలైనవానిని సమర్పిస్తూ చేసే ఆరాధనకు బాహ్య యాగం అని పేరు.

ఇంతవరకు—

"తాపః పుండ్రః తథా నామ మంత్రో యాగశ్చ పంచమః" అని చెప్పబడే ఐదు సంస్కారాలను గూర్చి సంగ్రహంగా నివేదించాము ఈ ఐదు చాలా ఉన్నతమైన, విలక్షణమైన సంస్కారాలు. మనలను పరమైకాంతులుగా, అంటే, " మఱందుమ్ పుఱమ్ తొழா మాందర్" ( మరచిపోయి కూడా అన్య దేవతలను ఆరాధించని మందులుగా ) చేస్తాయి. " అమీ పరమ సంస్కారాః పారమైకాంత్యహేతవః" అని పెద్దలు చెప్పారు.

దాస్య కులమైన శ్రీవైష్ణవకులంలో జన్మించిన అదృష్టాన్ని కలిగినవారు ఒక సదాచార్యుని ఆశ్రయించి పంచ సంస్కారాలను పొంది, దాని మూలంగా భగవంతుని అనుగ్రహాన్ని సంపాదించి, మహానందాన్ని పొందుదురు గాక.

**సర్వే జనాః సుఖినో భవంతు**

**కవితార్కిక సింహాయ కళ్యాణ గుణశాలినే,**

**శ్రీమతే వేంకటేశాయ వేదాంత గురవే నమః.**

**శ్రీమతే రమ్యజా మాతృ మునీంద్రాయ మహాత్మనే,**

**శ్రీరంగవాసినే భూయాత్ నిత్యశ్రీః నిత్య మంగళమ్.**

**మంగళా శాసనపరైః మదాచార్య పురోగమైః,**

**సర్వైశ్చ పూర్వైరాచార్యైః సకృతాయాస్తు మంగళమ్.**